# ఆర్యకథావలి,

## నాల్గవ భాగము.




రచయిత:

టి. వి. నరసింగరావు,

బి.ఎ., యల్.టి,

డి. ఐ. ఆఫ్ స్కూల్సు,

నంద్యాల రేంజి.



పబ్లిషర్సు:

రామా అండ్ కో.,

విద్యావిషయిక ప్రచారకులు,

తల్లపాడు, (నెల్లూరుజిల్లా).




[వెల రు 0—1—0

# రామకృష్ణజంత్రి.



ఇది 1, 2, 3 భాగముల వకేబైండు. ఇందులో ఎన్ని సెంట్లకుగాని యెన్ని యెకరములకుగాని యేరేటులో కావలసినను శిస్తు వివరముగా తెలుసుకొనుటకున్ను, యూనిట్ రేట్లకు కావలసిన వివరములున్ను, జీతములు, పెన్షనులు, యింటిఅద్దెలు మున్నగునవి యేనెలలో యెన్నిరోజులకు కావలసినను అవి మిక్కిలి సులభముగా తెలిసికొనుటకు ఉపయోగకరమైన గ్రంథము. ఇది గ్రామ కరణములకును, మునసబులకును, రివిన్యూ ఆఫీసరులకును, తదితరులకును ముఖ్యముగా చేతియందుండదగినదై యున్నది. ఇటువంటి పుస్తకము యిదివరకెన్నడును యెవరును తయారుచేయించి యుండలేదు. కొద్దిప్రతులు మాత్రమే అచ్చువేయింపబడి యున్నవి. త్వరలో ఆర్డర్లు పంపినవారికే దొరుకును.

వెల పుస్తకము 1కి రు 1—8—0 మాత్రమే.

# ఆర్యకథాలహరి

## నాల్గవ భాగము


గ్రంథకర్త:

టి. వి. నరసింగరావు, బి.ఎ., ఎల్. టి.,

డెప్యూటి ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు,

నంద్యాల రేంజి.





ప్రకాశకులు:

రామా అండ్ కో

విద్యావిషయికప్రచారకులు,

నర్సాపూరు, (కృష్ణా జిల్లా)




[వెల 0—4—0

# విషయసూచిక.

——:o:——

# ఆర్యకథాలహరి.

## నాల్గవభాగము.

### 1. చిరంజీవి.

పూర్వకాలమున మృకండుఁడను మునీంద్రుఁ డొకఁడు కలఁడు. ఆతని భార్యపేరు కుముద్వతి. వారికి సంతానము లేదు. ఒకనాఁటి దినమునఁ గుముద్వతి సంతానములేదని విచారించుచుండఁగా, నరణ్యములకుఁ బర్ణములకును, ఫలములకు నరిగిన మృకండుఁడు వచ్చి యామెను జూచి "నీవేల చింతించుచున్నావు? అతిథి అభ్యాగతిపూజలు మన యాశ్రమమున యథావిధిగ జరుగుచున్నవి కదా! మునికన్యకలు నీకుఁ బరిచర్యలు భక్తిశ్రద్ధలతోఁ జేయుచుందురు కదా! ఇంక నీకుఁ గొఱఁత యేమున్న"దని యడిగెను. అందుల కామె "నాథా! నాకుఁ దేనినిగూర్చియుఁ జింతలేదు. ఉన్న చింత మాత్రము పెద్దదే. పుత్రులు లేనివారికి గతులు లేవని పెద్దలు చెప్పుదురు. నాకట్టి చింత మనంబున బాధించుచున్నది. ఇందులకుఁ దపోధనులగు మీ రేమయిన నుపాయ మూహింపవలదా?" యనెను. ఈశ్వరునిఁగూర్చి తపంబొనర్చి పుత్రునిఁ బడరో జేయుమని మృకండుఁడు వచించెను.

అంత నయ్యిరువురును దపము జేయఁదలఁచి కాశీపుర మున కేఁగిరి. అచ్చట విశ్వనాథుఁడున్నాఁడు. ఆ మహాపుణ్య క్షేత్రమునఁ బరమపావనమైన గంగానది యున్నది. గంగాస్నా నముఁ జేసినచో సర్వపాపములు నశించును. సౌఖ్యము లొంద వును. నిర్మలమైన జ్ఞానము కలుగును. ముక్తిలభించును. వార ణాసి కాముని దంపతులు జేరి, గంగయందు స్నానమాచరించి, విశ్వనాథుని యాలయముఁ బ్రవేశించి, నిశ్చలచిత్తముతో నమ్మ హాదేవునిఁ బూజించుచుండిరి. కొన్నాళ్ళకుఁ బరమేశ్వరుఁడు వారియందుఁ గరుణవహించి ప్రసన్నుఁడయ్యెను. మృకండుఁడు భార్యాసహితుఁడై యా దేవాదిదేవునకు సాష్టాంగదండము లర్పించి యనేకవిధములఁ బ్రస్తుతించెను. శంకరుఁడు ప్రీతినంది యామునీంద్రునిగాంచి "మృకండా! నీభక్తికి మెచ్చితిని. నీయభీ ష్టము గ్రహించితిని కాని, యొక్క సంగతి మాత్రము చెప్పు చున్నాను. మూఢుఁడై యూరుపేరులు లేకుండ నూఱేండ్లు జీవించు పుత్రుఁడుకావలయునా? లేక కీర్తివంతుఁడై పది యాఱేండ్లు మాత్రమే జీవించు పుత్రుఁడుకావలయునా? ఆలో చించి చెప్పు"మని పలికెను. ఆహా! ఈశ్వరుని ప్రశ్న మహా కష్టమైయున్నది. అందులకు మృకండుఁడేమని ప్రత్యుత్తర మీయవలయునో తోచక కొంతసేపాలోచించెను. నిశ్చల

నింతకాలము తపమాచరింపఁగాఁ బరమేశ్వరుఁడు

...న్నుఁడై యిట్లు వచించెనుగదాయని యతఁడు విచారిం



చెను. తుద కాతఁడు ధైర్యమువహించి పరమేశ్వరునకు నమస్కరించి "దేవా! కైలాసవాసా! నీచర్యలనంతములు. నీమాయ లెవ్వరును గనుగొనఁజాలరు. నాచిత్తమును బరీక్షించుటకే నీవిట్లానతిచ్చితివి. అయిననేమి? నీదయ యెట్లున్న నట్లగు. విజ్ఞానియు యశముదెచ్చువాఁడునునై పదియాఱుసంవత్సరములు జీవించు కుమారునే ప్రసాదింపు"మని వక్కాణించెను. పార్వతీనాథుఁడు మృకండుఁడుగోరినట్లు వరమనుగ్రహించెను.

తరువాత మృకండుఁడు భార్యాసహితుఁడై నిజాశ్రమమునకు వచ్చెను. కొన్నాళ్ళకు కుముద్వతి గర్భముధరించి యొక శుభలగ్నమునఁ గుమారునిఁగనెను. నందనోదయమునకు దంపతులు మహానందమందిరి. ఆ కుమారునకు జాతకర్మాదిమహోత్సవ మనేక మునులసన్నిధిని గావింపఁబడి మార్కండేయుఁడను పేరు బెట్టఁబడెను. మార్కండేయునకైదుసంవత్సరముల వయస్సు వచ్చిన యంతనే మృకండుఁడాతని కక్షరాభ్యాసమహోత్సవము నెఱపెను. తండ్రి యనుగ్రహమున నాతఁడు క్రమముగా సమస్తవిద్యలఁ నభ్యసించి, జ్ఞానమునార్జించి తల్లిదండ్రులకును, నాప్రాంతముననున్న మునులకును మోదము గలిగించుచుండెను.

ఇట్లు కొన్నిసంవత్సరములు గడచెను. మార్కండేయునకుఁ బరమేశ్వరుఁడిచ్చిన యాయువు సమీపించుచుండెను.

ఇందులఁ గూర్చి మృకండుఁడును-కుముద్వతియు జింతింపసాగిరి. మార్కండేయుఁడు వారిఁ జేరి "తల్లిదండ్రులారా ! మీ రేల విచారించుచున్నారు? నే నేమైన మీ యెడలఁ జేయరాని కార్యముఁ జేసియుంటినా? మీయాజ్ఞ బాలింపకయుంటినా?" యని భక్తిపూర్వకముగఁ బలికెను.

కుమారుని వాక్యములకుఁ దండ్రి యిట్లనెను. "కుమారా! నిన్నుఁ బుత్రునిగాఁ బడసినందులకు మేము కృతార్థులమైతిమని సంతోషించుచుంటిమి. ఇప్పుడాసంతోషము మాహృదయము నెడబాయుచున్నది. మేము నిన్నుగూర్చి యగాధమైన దుఃఖవార్థిలో మునింగితిమి. మమ్ముద్ధరించుటకు మానవమాత్రులు శక్తులుగారు. మా విచారకారణము నీకెఱింగించుటకుఁగూడ నోరు రాకున్నది" అని పలికి మఱింత చింతింపఁదొడంగెను. తల్లి గూడ "నాయనా ! మా విచారము నీకెఱింగించినచో నీవుగూడ మావలెనే విచారించెద" వని పలికెను. "తల్లి దండ్రులారా ! మీరు శంకింపవలదు. ధైర్యమువహించి మీ విచారకారణము నెఱిగింపుఁడు. దానిం బాపుటకుఁ బ్రయత్నించెద" నని మార్కండేయుఁడు పలుక, నాదంపతు లాతని కిట్లనిరి. "పరమేశ్వరానుగ్రహమున నిన్నుఁ బడసితిమి. కాని నీ కమ్మహాదేవుఁడు పదియాఱువత్సరముల యాయుర్దాయముమాత్రమే యిచ్చియున్నాఁడు. అది పూర్తి

గావచ్చినది. ఇఁక మా తనువులు భూమిపై నెట్లు నిలచునా యని విచారించుచున్నాము."

ఆ మాటలు విని మార్కండేయుఁ డొక్కింతయు నధైర్యమందలేదు. ఆతఁడు తల్లిదండ్రుల కిట్లు పలికెను. "మీరు నాకొఱకిట్లు విచారింపవలదు. భగవంతుని యాజ్ఞను దాటుట కెవ్వరికిని దరముకాదు. పరమేశ్వరుఁడు మానవ కోటి చిత్తముల ననేక విధములఁ బరీక్షించుచుండును. ఆతడు దయాసాగరుఁడు. ఆశ్రితరక్షకుఁడు. పుట్టినది మొదలు బుద్ధిపూర్వకముగ నే నేవిధమయిన పాపమును జేసియుండ గను. ఆ భగవంతుఁడు నన్నేల చంపును? మీరు ధైర్యమున నుండుఁడు. నే నిప్పుడే పోయి తపము జేసి యీశ్వరుని బ్రసన్నునిగా జేసికొని వచ్చెదను. నేను మరణింతునని మీరు తలంపవలదు."

ఇట్లు పలికి, తల్లిదండ్రులకు ధైర్యముఁ జెప్పి మార్కండేయుఁ డాశ్రమమునువిడిచి, యాసమీపముననున్న శివాలయమును బ్రవేశించి, యందు లింగాకృతిఁ దాల్చి యున్న పరమేశ్వరునిఁ బూజించుచుండెను. ఆతనికిఁ బదియాఱేండ్లు నిండెను. ఆదినమున యమభటులువచ్చి "ఓయీ! బాలుఁడా! ఇఁక నీపూజనాపి యీవలకురమ్ము. నీ యాయుర్దాయము నిండినది. అందుచేత యముని పంపున నిన్నుఁ గొనిపోవుటకు

వచ్చితి"మని, పలికిరి. మార్కండేయుఁ డామాటలకు భయ పడక "నన్నుఁ గొనిరండని చెప్పుటకుఁ గాలుఁడెవఁడు? పొండు. నేను శివపూజఁ జేసికొనుచున్నాను. రాను, అనెను. యమ కింకరులు బాలుని ధైర్యమునకు మిగుల నచ్చెరువుబొందిరి. వారాకుమారు నీవలలాగుటకు సమీపించిరి, కాని యాతనిని ముట్టుకొనుటకు మిగుల భయపడిరి. అంతట వారు మరలి పోయి యమునిఁజూచి "యమధర్మరాజా! నీయానతిని మేము మార్కండేయుని జీవముల హరించుటకుఁ బోయితిమి. కాని మాకు సాధ్యముకాలేదు. ఆతఁడు శివపూజ చేయుచుండెను. ఆతని తేజము మాకతి భయము గొలుపుటంజేసి సమీపింప లేకపోయితి"మని విన్నవించిరి.

కింకరుల మాటలకు యముఁ డత్యద్భుతము నందెను. వెంటనే యాతఁడే పాశధరుఁడై మార్కండేయుఁడు తపము జేయుచున్న స్థలమునకు వచ్చెను. ఆతఁడు బాలునిజూచి "రమ్మి నీయాయువు తీరిన"దని భీకరముగాఁ బలికెను. మార్కండేయుఁడు జంకలేదు. "నేను శివపూజ విడువను. నా పూజకు విఘ్నము కలిగింపవలదు. నీవు యముఁడవని నాకుఁ దెలియును. నేనురానుపొమ్మి" అనినుడివెను. "ఔరా! కాలుఁడ నగు నన్నుఁ దృణీకరించుచుఁ బలుకుచుంటివిగా! ఇదిగో నీజీవ ములు హరించుచున్నా"నని పలికి పాశమునుమార్కండేయుని మెడకువేసి లాగఁదొడంగెను. మార్కండేయుఁడు తాను

పూజించుచున్న శివలింగమును గట్టిగాఁ గౌఁగిలించుకొని "హే పరమేశ్వరా! కాలుని బారినుండి నన్ను రక్షింపుము. రక్షింపుము" అని వేడికొనుచుండెను. అప్పుడాలింగమును బ్రద్దలుజేసికొని పరమేశ్వరుఁ డీవలకువచ్చి యమునిఁజూచి "దండధరా? ఈతఁడు నాకుఁ బ్రియభక్తుఁడు. ఇట్టివాని జీవముఁల హరించుట కేలవచ్చితివి? పొమ్ము. పోకున్నచో నిన్ను భస్మము జేసివైచెద"నని పలికెను. యముఁడు భయఁపడి పరమేశ్వరుని శరణువేడికొని తనలోకమునకుఁ బోయెను. మార్కండేయుఁడు శివునిపాదములకు నమస్కరించి ప్రస్తుతించెను. శివుఁ డాతనికిఁ జిరంజీవిగానుండునట్లు వరమిచ్చెను.

ఇట్లు మార్కండేయుఁడు కృతార్థుడై నిజాశ్రమమునకు వచ్చి, తననిమిత్తము చింతించుచున్న తల్లిదండ్రులకావృత్తాంతము జెప్పెను. అప్పుడు వారు పొందిన యానందము వర్ణింప నెవరితరము! మునులందఱును మార్కండేయుని భక్తికి మెచ్చిరి.

దృఢమైన దైవభక్తి మృత్యువునైన జయింపఁగలదు.



## 2. జ డ భ ర తుఁ డు.

అంజనాభమను వర్షమును మున్ను భరతుఁడను నొక నృపాలుఁడు పరిపాలించుచుండెను. ఈ భరతునిచేఁ బాలింపఁ బడినదగుటచేతనే దానికి భరతవర్షమను పేరువచ్చెను. భరతుఁ డనేకసంవత్సరములు ధర్మసంధుఁడై రాజ్యమేలి తుదకు విరక్తుఁ డయ్యెను. రాజ్యమును కుమారులకుఁ బంచియిచ్చి తపస్సు జేసి కొనుటకుఁ బోయెను. గండకీనదీతీరమున నొకపర్ణశాల నిర్మించు కొని, భగవంతుని సేవించుచుఁ గాలము బుచ్చుచుండెను.

ఒకనాడాతఁడు స్నానముసేయుటకు నదికిఁ బోయెను. అప్పుడొక సంపూర్ణ గర్భిణియగు హరిణి జలపానము జేయు చుండెను. ఆసమయమున నొక మృగేంద్రము దిక్కులు ప్రతి ధ్వనించునట్లు గర్జించెను. ఆ భయంకరధ్వని విని హరిణము భయమంది లంఘింపఁబోవ, దాని గర్భము జారి యొక్క హరిణపోత మయ్యేటి నీటఁబడెను. వెంటనే హరిణము మృతి నందెను. హరిణపోతమును భరతుఁడు చూచి మిగుల జాలి బొంది, తనకుటీరమునకుఁ దీసికొనిపోయి మిగుల జాగ్రత్తతో బెంపఁదొడఁగెను. అయ్యది దినదినము ప్రవర్ధమానయగుచు నాతనికి సంతోషము గలిగించుచుండెను. భయంకర మృగ ములవాతఁ బడునేమోయని యతఁడు దానిని విడిచి యెచ్చ టికిని బోవువాఁడుకాఁడు. ఫలముల కాతఁ డరణ్యమునకు

బోయినప్పుడు దానినిగూడ వెంటఁదీసికొని పోవుచుండెడి వాఁడు. ఆతఁడు తపము జేసికొను సమయమున, నాహరిణ మాతనిఁ గొమ్ములతోఁ జిమ్ముచు, గిట్టలతో గోకుచు వినోద లీలలు సలుపుచుండును. ఈ హరిణము మూలమున నాతని తపస్సు నానాటికి సన్నగిల్లుచుండెను. ఇట్లు కొంతకాలము గడిచెను. ఆతనికి మరణకాల మాసన్నమైనప్పుడు తనప్రాణము లాహరిణము మీదనే నిలిపి ప్రాణములు విడిచెను. అందుచేత నాతఁడు పునర్జన్మమున హరిణమై జన్మించెను. మృగరూపమున నున్నను నాతఁడు పూర్వజ్ఞానమును బాయలేదు.

కొన్నాళ్ళకాతఁడు మృగరూపము విడిచి యంగిరసుఁ డను బ్రాహ్మణునకు సుతుఁడై యుదయించెను. అంగిరసున కిరువురు భార్యలుండిరి. జ్యేష్ఠభార్యకుఁ దొమ్మండుగురు కుమారులును, కనిష్ఠభార్యకు భరతుఁడును జనించిరి. భర తుఁడు సమస్త శాస్త్రములుఁ జదివెను. పితృమరణానంతరమున నాతని యగ్రజు లాతనియెడ ననాదరణము బూనియుండిరి. అతనిని వ్యవసాయపుఁ బనులయందు నియోగింపఁదొడఁగిరి. ఆతఁ డగ్రజులు వచించిన పనులు సేయుచుఁ గేవలము జడుని వలెఁ దిరుగుచుండెను. అన్నలచే నాజ్ఞాపింపఁబడి యాతఁడు చేయుఁబవళ్ళు పొలమునకుఁ గావలియుండెను.

ఒకనాటి రాత్రిసమయమున భరతుఁడు పొలమున మంచెపైఁ గూర్చుండఁగా, వృషలరాజభటులాతనిని బంధించు

కొనిపోయి, కాళికాదేవికి బలియిచ్చుటకు రాజుముందుఁ బెట్టిరి. రాజేంద్రుఁ డాతనిని గాళీమందిరమునకుఁ గొనిపోయెను. భరతుఁ డిదియంతయు గ్రహించి కొంచెమయినను భయమం దక హారిని ధ్యానించుచు నిలిచియుండెను. అంతలో-హారి భక్తుండగు భరతునిఁ జంపఁదలఁచిన రాజేంద్రుఁడే విగతజీవుఁ డయ్యెను. అంతట భరతుఁడు కాళీమందిరము విడిచి యావ లకువచ్చి, యెప్పటియట్ల తనపొలమునకుఁ బోయెను.

మఱికొన్నాళ్లకు సింధురాజగు రహూగణుఁడు, కపిల మహర్షివలనఁ దత్త్వోపదేశము వడయుటకు శిబికపై భరతుఁ డున్న పొలముమీఁదగాఁ బోవుచుండెను. శిబికావాహకులు జడునివలెనున్న భరతుని బట్టుకొని తోడ్కొనివచ్చి శిబికవాని మూపుపై బెట్టిరి. భరతుఁ డంకులకు విచారమందక మోయు చుండెను. కాని తక్కిన వాహకులతో సమముగా నడువఁ జాలకయుండెను. శిబిక వంకరఁగా బోవుచున్నదేమని రాజేం ద్రుఁడు వాహకుల నడిగెను. వారు భరతునివలన నట్లు జరుగు చున్నదని ప్రత్యుత్తరమిచ్చిరి. దానువలోనుండు నగ్నిచందమున గూఢమైన బ్రహ్మతేజముగల భరతుని మహిమ నెఱుంగక రహూగణుఁ డాభరతునిఁ బల్లకి సరిగా మోయుమని కఠిన ముగా మాటలాడెను. భరతుఁడెప్పటియట్లే శిబిక మోయు చుండెను. నృపాలుఁడు శిబిక నాపించి భరతునిఁగాంచి "ఓరీ! దుర్మదా! జీవన్మృతా! తెగబసిలియుండియు శిబిక నేల వంక

రగా మోయుచున్నావు? ఎంత చెప్పినను నీవు బుద్ధిని మానకున్నావు. నిన్ను శిక్షించెద'' నని గంభీరముగఁ బలికెను. అందులకు భరతుఁడు శాంతవాక్యములతో రహూగణున కిట్లు చెప్పెను. ''రాజేంద్రా! శిబికాభారము దేహమునకేగాని నా కణుమాత్రము లేదు. నన్ను జీవన్మృతుఁడని పలికితివి. జననమరణములు దేహముతోడనే పుట్టును. సేవకసేవ్యసంబంధము శరీరమునకేగాని జీవునకుండదు. నీవు నన్ను భయపెట్టుచుంటివి. జడుఁడనగు నాయందు నీదండనమేమిపనిసేయును?''

భరతునివాక్యములు విని రహూగణుఁడు శిబికదిగి యాతని పాదములకు నమస్కరించి ''ఓమహానుభావా! నీ వెవ్వఁడవు? అవధూతవలె నుంటివి నీమహిమ నెఱుంగక యపరాధము సలిపితిని. నన్ను మన్నించి దయఁతో జూడుము. కాలుని దండమునకుగాని, ఇంద్రుని వజ్రమునకుఁగాని, శ్రీహరి సుదర్శనమునకుఁగాని, హరుని త్రిశూలమునకుఁగాని భయమందును. కాని భూసురోత్తములకు భయమందుచుందును. నేడు నాసుకృతంబున నిన్నుఁ జూచితిని. నన్ను విజ్ఞానసంపన్నునిఁ జేయు''మని పలికెను. ఆ రాజు మాటలకు సంతసించి, భరతుఁడాతనికి దత్త్వోపదేశముఁ జేసి సంశయములఁ బాపి చనెను. భరతుఁడు తనచిత్తమును భగవంతునిపై నిలిపి, జడునివలెఁ దిరుగుచుఁ దుదకు మోక్షమందెను.

భక్తులకు దైవము తోడ్పడును.

---

## 3. శరణాగత రక్షణము.

ఒక పురంబున నొక కిరాతుఁడు పక్షులను వధించి వాని నమ్ముకొనుచు, జీవయాత్రఁ గడపుకొనుచుండెను. ఒకనాడాతఁడు పక్షులను బట్టుకొనుటకు వలసిన పరికరములఁ గైకొని యొక మహారణ్యమున కరిగి, పక్షులను బట్టుటకై వలఁ బన్నియుంచెను. అనేకపక్షులావలయందుఁ బడుచుండెను. సంధ్యాసమయ మయ్యెను. అప్పుడు ప్రళయవాయువుతోఁ గూడుకొన్న వర్షము సంభవించి, కాననమంతయు జలమయమై పోవుచుండ, బాపాత్ముండగు నాకిరాతుఁడు సమీపమున నున్న యొక చిన్నప్రవాహమును దాటి యచ్చట గుబురుగా నున్న వృక్షము క్రిందఁ జేరి చలిచే బాధనొందుచు, శిలయే పఱుపుగాఁ జేసికొని యావృక్షరాజమును విలోకించి "రాత్రి యైనది. ఇచ్చట నాకెవ్వరును దిక్కులేరు. నన్ను రక్షించుట కిచ్చటనున్న భూతంబులనే నమ్మియుందును గాక" యని శయనించెను.

అప్పుడా వృక్షరాజముపై వసించియున్న యొకకపోతము మేతకరిగిన తనభార్య చీకటిపడినను రాకయుండుటకుఁ గారణము నెఱుంగఁజాలక యిట్లు చింతించెను. "నాప్రియభార్య యెచ్చట నున్నదో కదా! ఇంతసేపు నన్ను విడిచి యెప్పుడును దుర్మఁచునది కాదు. అది లేకున్నచో నా సౌఖ్యమంతయు నిరర్థ

కంబుగదా ! మిక్కిలి యనురాగముగలిగి విలసిల్లు భార్య యొక్క సత్ప్రవర్తనము భర్తకు నిహాపరలోక సౌఖ్యము లొసగూర్చునని పెద్దలు చెప్పుదురు. అక్కటా ! అది యీవర్షమున జిక్కడనైనఁబడి చచ్చిపోయినదేమో! అట్లైన నాగతియేమి?

ఇట్లు శోకించుచు నాడిన వాక్యములు బోయవాని వలయందుఁ జిక్కికొనియున్న కపోతి యాలకించి మనంబున మిగుల సంతోషమంది, "పతిచిత్తమునకు సంతసము గల్గునట్లు వర్తించు కాంతయేకదా పుణ్యవతి యనంబడును. నన్నుగూర్చి నామనోహరుఁ డిట్లు ప్రియవాక్యములాడ విను భాగ్యముఁ గాంచితిని. ఇఁక నాజన్మము ధన్యతవహించినది. నేను కాలుని నైన గెలిచెద"నని తలంచి, పతికిఁ దనవిధంబు నెఱుంగఁ జేసి, యిట్లనెను. "భగవంతుం డొనర్చినదానికి శోకించినందు వలనఁ బ్రయోజనములేదు. శరణుఁబొందినవారిని రక్షించు టయే పరమధర్మమని యార్యులు వక్కాణింతురు. ఆబోయ మిగుల చలిచే వడఁకుచున్నాఁడు. శరణాగతుండైన వీనిని జేతనైనంతవఱకు నాపదఁ బొందకుండ రక్షింపుము."

కపోతి వాక్యంబులు విని యక్కపోతము కిరాతుని వీక్షించి " అన్నా ! నీవు మిగుల డస్సియున్నాఁడవు. మా భాగ్యవశమున నేడు మాయింటి కతిథివైతివి. నీకేమి యాతిథ్యంబు నేను సలుపవలసియున్నదో దాని

గింపుమనిన, నాపక్షిమారకుం డాపక్షిపలుకులకు మిగుల ముదంబంది "చలిబాధచే నాశరీరమంతయు ముక్కలై పోవు చున్నది. ఈ బాధ మాన్పు" మనెను. అంతట నక్కపోతము తత్ప్రదేశముననున్న చిన్నచిన్న పుల్లలన్నియు ముక్కునం గొనితెచ్చి పోవ్రుజేసి, సమీపముననున్న పల్లియకుం జని, చివఱ నగ్నియున్న పుల్లందెచ్చి, యా ప్రోవునంబెట్టి, బోయను శరీరము గాచుకొనుమని చెప్పెను. కిరాతుఁడు తనమేను నా యగ్నింగాచుకొని శీతబాధనువాసి, తనకాకలియగుచున్నదని పక్షి కెఱింగించెను. అందుల కుఁపాయంబేమియుఁ దోచక నక్కపోతము బోయంగాంచి "పక్షులకు నాహారంబని యొకటి నిర్ణయింపఁబడియుండునా! ఏ సమయంబున కేదిదొరికిన దానిని దిందుము. నీవు మిగుల నాకలిఁగొనియున్నవాడఁవు. ఎట్లయిన నీయాకలిబాధఁ దీర్పవలయును. అందులకై నీకు నాశరీర మాహారముగాఁ జేసెద"నని పలికి యగ్నింబడెను.

కపోతము తనకై యగ్నింబడుటఁ జూచి యాపాపాత్ముఁడు విస్మయంబంది, తన మనంబున "ప్రపంచమున నింతటి కార్య మెచ్చటనైనఁ గాంచియుంటినా! నాచరిత్రము మిక్కిలి నిందకుఁ బాత్రమైయున్నది. ఇఁక నిట్టి క్రూరకార్యములు సేయుట మానివేసెదను. నాకీ కపోతమే గురువై సద్బోధఁ గావించినది. ఈ పక్షి నా నిమిత్తమై తనభార్యను బంధువులను దుర్మార్గుఁ,యగ్నింగూలినది. నేనును దుష్కార్యములు సేయుట

మాని శ్రీహరిని సేవించి ముక్తినందెదఁ గాక" యని తలంచి వైరాగ్యమనస్కుండై, వలయందున్న పక్షుల నన్నిఁటిని విడిచి పక్షులఁబట్టు సాధనంబుల నావలఁబాఱవేసెను.

కపోతంబగ్నిలోఁబడుట వీక్షించి కపోతి తనచిత్తమున 'నాయాకలిఁదీర్పకుండ నీవెన్నఁడు నాహారము గొనవైతివి. నేను నన్ను విడిచి యరుగుట నీకు ధర్మమా! నదీతీరంబులకడను, పొదలకడకును, నెలమావివృక్షంబులకడకును, విహరించుటకు నన్నుఁగూడఁ గొనిపోవు నీలీలలు నాకు మఱువశక్యమగునా? ప్రాణేశ్వరా! నేనుగూడ నీవరిగినస్థలంబునకు వచ్చెదను. ఇరువురమును నచ్చట సుఖముగానుంద"మని భర్తం దలంచుచు నగ్నింబడి ప్రాణంబులవాసి, ప్రకాశమానమైన విమానముమీఁద నమరులుగొలువ దివ్యతేజంబుతో విరాజిల్లు భర్తంగలసి, యచ్చరకంటు లభివందనంబులొనర్ప శ్రీహరి సాన్నిధ్యమున కేగెను.

కిరాతుఁడును వీరివర్తనముగాంచి తానుగూడ నట్లగుటకుఁదలంచి శరీరంబెల్ల ముండ్లచే గ్రుచికొనిపోవఁ గాననంబంతయుఁ జరించుచు నొక్కచోట దవానలంబునుగాంచి సంతోషచిత్తుండై, భగవధ్యానము జేయుచు, నందుఁబ్రవేశించి దేవత్వమునందెను.

శరణుజొచ్చినవారిని రక్షించుటయే పరమధర్మము.

---

# 4. తులసీదాసు.

హస్తినాపురమున బ్రాహ్మణుండయిన ఆత్మారాముఁడను వానికి ఈ తులసీదాసు పుత్రుఁడు. ఆ కాలమున ఢిల్లీచక్రవర్తియైన యక్బరుపాదుషాచే నాత్మారాముఁడు మిగుల గౌరవమును బొందుచుండిన కారణమున నతనిపుత్రుఁడగు తులసీదాసునియందుగూడ చక్రవర్తి మిగుల ప్రేమకలిగి యుండెను. ఆత్మారాముఁడు తులసీదాసునకుఁ బండ్రెండవయేట మాతాదేవియను కన్యకను వివాహముఁజేసెను. మాతాదేవి సహజసద్గుణవతియు సౌందర్యవతియునై యుండెను. భార్యాభర్త లెప్పుడును నొకరినివిడిచి వేఱొక రుండువారు కారు. సాధ్వియగు మాతాదేవిభర్తయే దైవమని తలఁచి తులసీదాసుని సేవించుచు నత్తమామల మన్ననల నందుచుండెను.

ఇట్లుండ నొకదినమున నక్బరుపాదుషా తులసీదాసు నెచ్చటికో తీసికొనిపోయెను. ఆ సమయమున మాతాదేవి పుట్టినింటినుండి యొకఁడువచ్చి యామెతల్లి కేదో జాడ్యముచే నపాయస్థితియందుండుటచేఁ దోడ్కొనిపోవుటకు వచ్చితినని చెప్పెను. తనతల్లియొక్క స్థితిఁదలంచి తులసీదాసు గృహంబున లేకపోవుటచే నామాతాబాయి యత్తమామల యనుజ్ఞ బొంది, యాక్షణంబుననే పుట్టినింటికరిగెను. సంధ్యాసమయమునకుఁ దులసీదాసు గృహంబునకువచ్చెను. మాతా

బాయి గృహంబున లేదు. ఆమె పుట్టినింటి కేగిన సంగతి జననీ జనకులవలన నెఱింగెను. అతఁడెప్పుడును భార్యను విడిచి యుండలేఁడు. అందుచేత నాతఁడానిముషంబునఁ దల్లిదండ్రులకుఁ జెప్పకుండ బయలుదేరి యర్ధరాత్రిసమయమున మాతాదేవి పుట్టినిల్లుఁ జేరెను. నిశాసమయ మగుటచే గృహకవాటములన్నియు బంధింపఁబడి యున్నవి. ఎంతపిలిచినను నెవ్వరుఁ బలుకరైరి. అతఁడెట్లయినను గృహములోఁ బ్రవేశించుటకు మార్గ మరయుచుండెను. అప్పుడొక గోడమీద వ్రేలాడుచుండిన పాముతోఁకఁ గాంచి, త్రాడని తలంచి దానిం బట్టుకొని గోడనెక్కి లోపలఁ బ్రవేశించెను. గదియందు మాతాదేవి నిద్రించుచుండెను. తులసీదాసామెం జేరి మేల్కొలిపెను. ఆమె తులసీదాసుం గాంచి యద్భుతమంది "అర్ధరాత్రిసమయమున నెట్లువచ్చితిరి? కవాటము లన్నియు బంధించియుండఁగా లోపల నెట్లు ప్రవేశించితి"రని యడిగెను. తులసీదాసు తాను జేసినపని నెఱింగించెను. తులసీదాసు పట్టుకొనిన త్రాడును జూడఁదలఁచి యామె దీపమును బట్టుకొని పోయెను. అది త్రాడుగాక కృష్ణసర్పమై యుండెను. తనపతి నాసర్పము కఱవనందులకుఁ పరమేశ్వరుని యనుగ్రహమని తలంచి, మాతాబాయి సంతోషించి, నెమ్మదిగా నాతనికిట్లనెను. "నాథా మీరు నాయందున్న మోహముచేఁ దల్లిదండ్రులసేవను మాని యీయర్ధరాత్రిసమయమున నిట్లువచ్చితిరి. సర్పముతోఁకఁ బట్టుకొని గోడ

నెక్కితిరి. సంసారము సారములేనిది. తనువు లశాశ్వతములు. సంపదలు చంచలములు. భోగము లస్థిరములు. నామీద మీకున్న యనురాగములో కొంచెమైనను భగవంతుని సేవించుటయందున్నచో శాశ్వతానందపదవిని జెందవచ్చునుగదా!"

మాతాదేవివచనములతోఁ దులసీదాసునకు జ్ఞానోదయమయ్యెను. "నీవేపరమగురువు" వని యాతఁడామెకు నమస్కరించెను. నాటినుండియు నాతఁడు శ్రీరామచంద్రుని మనంబున నిలిపియుండెను. అనుదినంబును నాతఁడొకచోట రామాయణము బఠనము జేయుచుండెను. ఇట్లు పండ్రెండు సంవత్సరములు గడచెను. ఇట్లుండ నొకనాటిప్రాతఃకాలమున వాడుకప్రకారము శౌచాంతమున శేషించినజలము నొకవృక్షమూలమునఁ బోయుచుండ నొక బ్రహ్మరక్షస్సు భయంకర రూపముతో నాతని యెదుటనిలిచి "నే నొకబ్రహ్మరాక్షసుఁడ. ఈవృక్షము నాశ్రయించుకొని యుంటిని. నదీ తటాకాదుల యందు జలము ముట్టుకొనుటకు నా కధికారములేదు. పండ్రెండు సంవత్సరములనుండి నీ వీ వృక్షమూలమునఁబోయు శౌచశేషజలముచే నా దాహమార్చుకొనుచుంటిని. ఆకారణమున నీ యభీష్టమెద్దియైన నొకటి తెలుపుము. తీర్చెద" నని పలికెను. ఆ మాటలు విని తులసీదాసు తనకు శ్రీరామచంద్రదర్శనము జేయింపు" మని పలికెను. బ్రహ్మరాక్షసుఁడు తులసీదాసునిఁజూచి "అయ్యది నాకు సాధ్యముగాకపోయినను నీ

కొక యుపాయము చెప్పెదను. నీ వట్లు చేయుము. ప్రతిదినము నీవు రామాయణము జదువు స్థలమున నీకు బ్రక్కగా నొకవృద్ధ బ్రాహ్మణ బ్రహ్మచారి కూర్చుండి, వినుచుండును. అతఁడు కేవలము హనుమంతుఁడని తలంపుము. నీ వతనిని వేడు కొను" మని చెప్పెను.

తులసీదాసందులకు సంతోషించి వెడలెను. ఆ మఱు నాఁడు రామాయణ పారాయణానంతరమున దులసీదాసు బ్రహ్మ రాక్షసుఁడు చెప్పిన బ్రహ్మచారిం జేరి నమస్కరించి, యనేక విధ ముల స్తుతించి తనకు శ్రీరామచంద్ర దర్శనము జేయింపు మని ప్రార్థించెను. మారుతి యనుగ్రహమునఁ దులసీదాసు నకు శ్రీరామచంద్రదర్శనము లభించెను.

తరువాత తులసీదాసు కాశీక్షేత్రమున కేగి యందొక మఠమున నివసించుచు శ్రీరామసంకీర్తనంబునఁ గాలము బుచ్చుచుండెను. ఆతని శ్రీరామభక్తి వర్ణనాతీతమై యొప్పెను. అనేకు లాతనివలనఁ గృతార్థులగుచుండిరి. ప్రతిదిన మాతని మఠమున లెక్కింపనలవిగాని భక్తులు భుజించుచుండిరి. శ్రీమంతు లనేకులు మఠమునకు స్వర్ణరజితాది పాత్రల నొసం గిరి. ఒకనాటి రాత్రిసమయమున నిరువురు చోరులు మఠములోఁ బ్రవేశించి స్వర్ణరజిత పూజోపకరణములను దీసికొనిపోవు చుండిరి. వారు పోవు ద్వారమున నిరువురు పురుషులు

బాణపాణులై యుండుటఁజూచి, మఱియొకద్వారమునకుఁ బోయిరి. అచ్చటను నాపురుషులుండిరి. చోరులద్భుతమంది, వారు గొనిపోవుచున్న వస్తువుల నచ్చటఁబడవైచి పాఱిపోవఁ జూచుచుండిరి. ద్వారపాలకులు వారిని బోనీయక యడ్డగించిరి. ఇంతలో స్నానమునకై యరుగుటకు తులసీదాసు మఠము నుండి యీవలకు వచ్చెను. ద్వారపాలకు లదృశ్యులైరి. చోరులు తమ వృత్తాంతముఁ దెలిపి తులసీదాసుపాదములపైఁ బడి రక్షింపుమనివేడిరి. చోరుల నడ్డగించిన ద్వారపాలురు శ్రీరామలక్ష్మణులేయని తలంచి, సంతోషించి "మీకు సుల భముగా రామచంద్రుని దర్శనము లభించినది. మీరు కృతా ర్థులు"అని పలికి, తులసీదాసు వారికి రామమంత్రము నుప దేశించెను. తులసీదాసు మహా మహిమగలవాడని తెలుపు కథ లనేకములుగలవు. ఒకసమయంబున నక్బరుపాదుషా యీతనిని బిలిపించి, "నీవు వారణాసియం దనేకమహిమలఁ బ్రదర్శించుచున్నాడ వఁట. నాకు మీ రాముని జూపింపుము. చూపకున్నచో నిన్నుఁ గదలనివ్వ" నని పలికి బందిగంబునం దుంచెనఁట. అప్పుడు దులసీదాసు శ్రీరామచంద్రుని వేడు కొనగాఁ, వేనకువేలు వానరములు వచ్చి నగరమంతయు ధ్వంసముచేయుచుండఁగా నక్బ రాతనిభక్తికి సంతోషించి, కారాగృహమునుండివిముక్తునిజేసి, తానొనర్చినయపరాధమును దాఁపుమని వేడుకొని, యనేకభంగుల గౌరవించి బంపెనఁట.

ఇట్టి మహిమలసంగతి యెట్లున్నను తులసీదాసు గొప్పభక్తుఁడని చెప్పుట కెంతమాత్రము సందియము లేదు. ఈతఁడు రామాయణమును రచించెను. అయ్యది తులసీదాసు రామాయణ మను పేర మిగుల ఖ్యాతివహించి, నేటికిని ఉత్తరహిందూస్థానమునఁ బరమపావనమైన గ్రంథముగ నెన్నఁబడుచున్నది.

భక్తిప్రభావ మసమానమైనది.

---

## 5. రాయనమంత్రిభాస్కరుఁడు.

ఆంధ్రదేశచరిత్రమున వితరణగుణములో కొండవీటిసీమ కధికారియైన రాయనమంత్రిభాస్కరుఁడు మిగులఖ్యాతి వహించినాఁడు. ఆకాలమున విజయనగర సామ్రాజ్యము హరిహరరాయలుచేఁ బరిపాలింపఁబడుచుండెను. ఒకనాఁ డాతఁడు నిండుసభఁదీర్చియుండఁగా నిరువురు భట్టులువచ్చి రాయనమంత్రిభాస్కరుని దానమునుగుఱించి విశేషముగఁ బొగడిరి. వారిమాటలు హరిహరరాయలున కిష్టములేకపోవుటయేగాక కోపముగూడ గలిగెను. ఆతఁడు భట్టులనుజూచి "మీకెవ్వరు కడుపునిండఁ దిండిఁబెట్టిన వారినిఁ బొగడుదురు. ఇది మీకువృత్తి" యని పలికెను. అందులకు భట్టులు రాజుంజూచి "మేము మంత్రిభాస్కరునిఁగూర్చి జెప్పిన విషయములలో

నొకటియు నసత్యము లేదు. ఆతనికీడయిన వదాన్యుఁ డీకాలమున లేడని మేము మఱియొకసారి చెప్పుచున్నాము. మా వాక్యములలో నబద్ధమున్న మమ్ము శిక్షింపవచ్చు"నని నిర్భయముగాఁ బలికిరి. ఆ మాటలువిని హరిహరరాయలు "నే నిప్పుడేమిచెప్పినను బ్రయోజనములేదు. నే నా భాస్కరుని దానగుణమును పరీక్షించెదను. మీమాటలలో సత్యమున్న మిమ్మధికము సత్కరింతును. లేదేని శిక్షింతును. అంతవఱకు మీరు నాకడ నుండుఁ"డనెను. భట్టులందులకు సమ్మతించి హరిహరరాయలునొద్ద నుండిరి.

హరిహరరాయలు తన యాస్థానముననున్న యిరువురు భట్టులను మంత్రిభాస్కరుని వదాన్యతను బరీక్షించి యందాతని కెట్లయిన పరాభవముఁగూర్చి రండని తెలిపి, వినుకొండకుఁ బంపెను. ఆభట్టులు వినుకొండకువచ్చి పెక్కునాళ్ళుండి భాస్కరుని దానవ్రతమునకు భంగముగలిగించుట కనేక ప్రయత్నములు జేసిరి. కాని యణుమాత్రమైన బ్రయోజనము లేకపోయెను. వారు విజయనగరమునకు మరలిపోయి "మహారాజా! మీతో మనసభకువచ్చిన భట్టులు మంత్రిభాస్కరుని గూర్చి చెప్పినమాటలు సత్యమే. ఆతనిని మేము వేయివిధములఁ బరీక్షించితిమి. ఆతనివ్రతమునకు భంగ మొదవించుటకు మాకు శక్తిచాలదు" అని చెప్పిరి. హరిహరరాయలంతటితో సంతృప్తినొందక, మంత్రిభాస్కరుని వదాన్యతను తానే పరీ

కీంపఁదలఁచి యాతనిని గౌరవంబుగఁ దోడితెచ్చుటకు మంత్రులను బంపెను. ఆమంత్రులు వినుకొండ కరిగి హరిహరరాయల యాజ్ఞను భాస్కరునకుఁ దెలిపిరి. భాస్కరుఁడు ముదంబంది, మంత్రులతో విజయనగరమునకు వచ్చెను. హరిహరరాయ లాతనినిగౌరవించి తన నగరంబునఁ గొన్నాళ్ళుండుమని కోరెను. భాస్కరుఁ డందులకు సమ్మతించెను.

ఇట్లుండ నొకనాడు సూర్యగ్రహణము వచ్చెను. హరిహరరాయలు తుంగభద్రానదికి స్నానార్థము బోవుచు భాస్కరునిఁగూడఁ దనవెంట రమ్మనిపిలిచెను. వినుకొండనుండి భాస్కరుఁడు వచ్చునప్పుడు విశేషముగా ధనము తీసికొనిరాలేదు. విజయనగరములోని బ్రాహ్మణులెల్లరును దానగుణఖనియైన భాస్కరుఁడు వచ్చెనని, చెప్పుకొనుచుండిరి. హరిహరరాయలుతో నదీస్నానమునకుఁ బోయినచో నచ్చటఁ దన్నుఁజూచుటకువచ్చు బ్రాహ్మణుల కేమియియ్యగలనని యాతఁడు సంశయించెను. కాని రాజమాటఁ దీసివేయజాలక యాతనితో స్నానమున కరిగెను. అట్టి సమయమున భాస్కరునకుఁ దప్పక పరాభవము జరుగునని రాయలు తలంచి యుండెను. భాస్కరుఁడు స్నానముఁజేసి గట్టునకు వచ్చినయంతనే యాతనికడ కొక బ్రాహ్మణుఁడు వచ్చెను. ఇప్పుడేమి సేయుదునని మనంబునఁ దలంచి, భాస్కరుఁడు తన దేవతార్చన పేటికయందుఁ జేయివెట్టిచూడగాఁ నొక బంగారపు

మాడ కనిపించెను. అతఁడు దాని నాబ్రాహ్మణున కొసంగెను. వెంటనే పెక్కండ్రు భూసురులు వచ్చి యాతనిం జేరిరి. "నేఁడు నావ్రతమునకు భంగమొదవును గాఁబోలు!" నని చింతించి, తన్ను రక్షింపుమని సూర్యభగవానుని స్మరించి, దేవతార్చన పేటికయందు మరల హస్తము పెట్టెను. ఆహా! భగవంతుని మాయఁ గనుంగొనుట కెవ్వరితరమగును? దేవతార్చన పేటిక యంతయు బంగారు మాడలతో నిండియుండెను. భగవంతుఁడు తనయెడల నట్లు కృపఁజూచినందుల కానందమందుచు భాస్కరుఁడామాడలను, బ్రాహ్మణులకు దానమిచ్చెను. భూసురులు భాస్కరుని వదాన్యతను శ్లాఘించి, దీవించి చనిరి. హరిహర రాయ లద్భుతమందెను.

రాయలొకనాడు భాస్కరునకు రత్నకంకణములను బహుమతిగా నిచ్చెను. భాస్కరుఁడు స్నానము సేయఁబోయి నప్పు డొకకంకణము నదియందు జాఱిపడెను. అప్పుడాతఁడు గంగనుద్దేశించి, "తల్లీ! నీకీకంకణము ధరించుటకుఁ గోరికపుట్టె నదా! ఒక్కకంకణమేమి బాగుండును! రెండవదానింగూడ దీసికొను"మని చేతినున్న రెండవ కంకణముగూడ నీటియందు వేసెను. ఈ విధమంతయుఁ జూచి రాయలమంత్రులు కొందఱు "మిమ్ముల నగౌరవము జేయుటకు మీరిచ్చిన కంకణములను భాస్కరుఁడు నదియందుఁ బడవేసె"నని రాయలుతో జెప్పిరి. ఆమాట విన్నంతనే రాయలాగ్రహమునంది, భాస్క

రుని రావించి కంకణము లేమిచేసితివని యడుగ, గంగాభవాని ధరించుట కర్పించితినని భాస్కరుఁడు బదులుచెప్పెను. అందు లకు హరిహరరాయలు "నీ వొసంగిన కంకణంబులచేనొప్పు గంగామహాదేవిని జూపగలవా?" యని భాస్కరు నడిగెను. "రత్నకంకణములచే నొప్పు గంగాభవాని హస్తములఁ దప్పక చూపింపఁగల"నని భాస్కరుఁడుప్రత్యుత్తరమిచ్చెను. హరిహర రాయలు భాస్కరుని వెంటఁబెట్టుకొని పరివారముతో నడ కరిగెను. భాస్కరుఁడు భాగీరథిని స్తుతించినంతనే యమ్మహా దేవి యాతఁడు నదియందుఁ బడవేసిన రత్నకంకణములతో రాజిల్లు హస్తములను పైకెత్తిచూపెను. హరిహరరాయలా చిత్రమునుజూచి యాశ్చర్యమంది, భాస్కరునిఁ బెక్కువిధం బులఁబొగడి సత్కరించి వినుకొండకుఁ బంపెను.

దా న మ హి మ గొ ప్ప ది.

---

## 6. శకుంతల-దుష్యంతుఁడు.

హస్తినాపురాధీశ్వరుఁడైన దుష్యంతుఁ డొకనా డరణ్యంబున కరిగి, పెక్కుమృగముల వధించి యొకహరిణ మును దఱుముచుఁ గడుదూరమేగెను. అచ్చట నాతనికొక రమణీయమైన వనంబుబొడగట్టెను. అతఁడందు బ్రవేశించి,

యచ్చటికరుదెంచిన మునిబాలురచే నయ్యది కణ్వమహాముని తపోవనంబని యెఱింగెను. అంతట నాతడు తనభటుల నచ్చోట నుంచి, కణ్వుని దర్శింపఁదలఁచి యాశ్రమమునకు బోయెను.

ఆశ్రమములో మునీంద్రుడు లేడు. ఆతనికూతురగు శకుంతలమాత్రమే యుండెను. దుష్యంతుఁ డామెసౌందర్యమున కద్భుతమందుచు నిలిచియుండెను. శకుంతల యారాజోత్తమునిఁజూచి, దుష్యంతుఁడనియెఱింగి యర్ఘ్యపాద్యాది విధులఁ బూజించెను. దుష్యంతుఁడామెను "కణ్వమునీంద్రుఁ డెచ్చటికరిగె" నని యడుగ "నాతం డిప్పుడే వనంబునకుఁ బండ్లుదెచ్చుటకుఁ బోయెను. సత్వరంబుగ వచ్చును. అంతవఱకు నిట విశ్రమింపు" డని పలికెను. శకుంతలను జూచిన యంతనే దుష్యంతుని చిత్తము చలించెను. మునికన్యపైఁ దనకుఁ గోరికగలిగినందులకు నొకసారి చింతించెను. నిశ్చయముగా నామె మునికన్యకయే యైనచోఁ దనచిత్తము చలింపదనితలంచెను. తుదకామెరాచకన్నియయనియు, నవివాహితయనియు నిశ్చయించి, యాతఁడామెను విలోకించి, "నారీమణీ! నీ వెవ్వతెవు? నీ పేరేమి? ఈ యాశ్రమమున నుండుట కేమికారణ"మని యడిగెను. "సకలధర్మస్వరూపుఁడైన కణ్వునకుఁ గూతురను. శకుంతలయనునామంబునఁ దనరుదాన"నని బదులుచెప్పెను. దుష్యంతుఁ డామాటలకు సంశయంబంది

నీవు పుత్రికవెట్లయితివో యెఱుంగఁగోరెద"నని యడిగెను.
శకుంతల దుష్యంతునకుఁ దన జన్మక్రమమిట్లు చెప్పెను.

"తొలుత రాజర్షియై, యనంతరము తపశ్శక్తిచేత బ్రహ్మర్షియైన విశ్వామిత్రుఁడు చేయుచున్న ఘోరతపమునకు నింద్రుఁడు భయమంది మేనకయను దేవవేశ్యను బిలిచి 'నీవు శీఘ్రముగఁబోయి విశ్వామిత్రుని తపమునకు భంగముగలిగించి రావలయు'నని చెప్పెను. అందులకు మేనక యాతనికిట్లనెను. "దేవేశ్వరా! గాధేయుని కోపాగ్నికిఁ బదునాల్గు భువనములును భయమందుచుండును. అట్టియెడల నబలనగు నేనాతనియెదుటకుఁబోయి నిలువఁగలనా? అయినను మీయాజ్ఞననుసరించి, నే నా మునివరుని పాలికిఁబోయి నానేర్పు తెఱంగున నాతనితపమునకు విఘ్నముగలిగింపఁ బ్రయత్నించెదను."

ఇట్లు పలికి యా మేనక హిమవత్పర్వత సమీపమున నున్న వనంబునఁ దపముసేయుచున్న విశ్వామిత్రునికడకరిగి, యాతనికి నమస్కరించి, యావనంబునఁ బుష్పములు గోసికొను నెపంబున విహరించుచుండెను. మేనకను జూచినంతనే విశ్వామిత్రుని హృదయము చెదరిపోయెను. ఆతఁడు తపము జాలించి తదేకదృష్టితో నామెను జూడఁదొడంగెను. తుదకాతఁడు తననిష్ఠనెల్ల నేటఁగలిపి, యా మేనకకు లోఁబడెను. మేనక యా మునియొద్దఁబెద్దకాలంబుండి, నన్నుఁ

గాంచి, యొక యేటిపులినతలంబునఁ బెట్టి తన లోకమున కరిగెను. విశ్వామిత్రుఁడు, నా తల్లి వలనఁ దన తపమున కంత రాయము కలిగెనని పశ్చాత్తాపమునంది, మఱియొక ప్రదేశ మున కేగి తపము జేయఁదొడంగెను. గాధేయుని తపః ప్రభావమున, నన్నుఁ గ్రూరమృగంబులు స్పృశింపకుండ, శకుంతములు రక్షించుచుండెను. ఇట్లుండ నొక దినంబున నా ప్రదేశమునకుఁ గణ్వమునీంద్రుఁడు వచ్చి నన్నుఁ దిలకించి, తన యాశ్రమమునకుఁ దోడ్కొనివచ్చి, శకుంతరక్షితనగు టంజేసి, శకుంతలయను నామమిడి గారాబంబునఁబెంచెను."

శకుంతల జన్మక్రమ మంతయు విని, దుష్యంతుఁ డామెను వివాహమాడఁదలఁచి యిట్లు పలికెను.

క. "ఈ వల్కలాజినములకు
నీవన్యఫలాశనముల ♦ కీ విటప కుటీ
రావాసములకు నుచితమె
నీ విలసితరూపకాంతి ♦ నిర్మలగుణముల్."

తరుణీమణీ ! నిన్ను వివాహమాడ నాకిచ్ఛ జనించినది. హస్తినాపుర చక్రవర్తినైన నాకిల్లాలుగా నుండఁదగిన నీ వీ యరణ్యమున నుండుటతగదు. వివాహములలో నెనిమిదివిధము లున్నవి. అందు క్షత్రియులకు గాంధర్వ రాక్షసములు ప్రశస్త ములై యొప్పును. కావున నన్ను గాంధర్వవిధినిఁ బెండ్లాడుము."

దుష్యంతుని పలుకులు విని యా శకుంతల,

క. "కరుణానిరతులు ధర్మ
స్వరూపులింతకు మదీయ ♦ జనకులు సనుదెం
తురు వారువచ్చి నీ కి
చ్చిరేనిఁ బాణిగ్రహణము ♦ సేయుము నన్నున్."

అని పలికెను. ఎట్టకేలకు దుష్యంతుఁ డామెను సమ్మతి పఱచిన, నామె యీతనిం గాంచి "రాజేంద్రా! నీవు నన్ను వివాహమాడఁ దలంచితివేని నీప్రసాదమున నాకు జనించు కుమారుని యువరాజుగాఁ జేసెదనని వరంబొసంగవలయు"నని పలికెను. దుష్యంతుఁడు శకుంతలకోరిన వరంబొసంగి యామెను గాంధర్వవిధిని బరిణయమాడి "ఇఁక నేను పురమున కరిగి నిన్నుఁ దోడ్కొని వచ్చుటకుఁ బురోహితామాత్య వర్గమును గణ్వుని సన్నిధికిఁ బంపెద" నని చెప్పి నిజపురమున కరిగెను.

---

## 7. వి వే కా నం ద స్వా మి.

కలకత్తానగరమున విశ్వనాథదత్తుఁడను నొక కాయస్థ బ్రాహ్మణుఁడు న్యాయవాదవృత్తిఁబూని జీవయాత్ర గడపుచుండెను. అప్పటి న్యాయవాదులలో నాతఁడు మంచిపేరును ధనమునుగూడ నార్జించుచుండెను. ఆతనికి సంపదకుఁగాని

సౌఖ్యమునకుఁగాని యేమంతయు గొఱంత లేదు. కాని, పుత్ర సంతానము లేకపోవుటచే నాతఁడు విచారసాగరమున మునింగి తనవిచారమును బాపుమని పరమేశ్వరుని నతిభక్తితో గొలిచెను. పరమేశ్వరుఁ డాతనియెడలఁ గరుణవహించెను. కొన్ని దినంబుల కాతనిభార్య గర్భవతియై కాలక్రమమున నొకకుమారునిఁ గనెను. నందనోదయంబునకు విశ్వనాథుఁడందిన యానందమునకు మేర లేదు. తల్లిదండ్రు లాకుమారునకు నరేంద్రుఁడను పేరుబెట్టిరి. నరేంద్రుడు దినదినప్రవర్ధమానుఁడగుచు దల్లిదండ్రులకును దక్కినవారికిని ముదంబుఁగూర్చుచుండెను.

నరేంద్రుని కైదవ వత్సరంబునఁ దండ్రి యక్షరాభ్యాసము జేయించెను. అకుమారుఁడు అచిరకాలములోనే సమస్తశాస్త్రముల యందును ప్రవీణుఁడయ్యెను. ఆతని విద్యాప్రావీణ్యత యెల్లవారిచేతను గొనియాడఁబడుచుండెను. కాని యాతని చిత్త మదియొకవిధమైన విరక్తి మార్గమున వర్తించుచుండెను. ఆతని విధము జూచి తల్లిదండ్రులు భయమందుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు నరేంద్రుని వెంటఁబెట్టుకొని యాతని పినతండ్రి రామకృష్ణపరమహంసదర్శనమున కేగెను.

నరేంద్రుఁడు రామకృష్ణపరమహంస చరణకమలంబులకు నమస్కరించెను. రామకృష్ణపరమహంస నరేంద్రుని ముఖతేజమును జూచి యచ్చెరువుఁబొంది యాతనితో ననేక విష

యములనుగూర్చి ముచ్చటించెను. పరమహంసకు నరేంద్రుని యందు నద్వితీయమైన ప్రేమ జనించెను. నరేంద్రుఁడు పరమహంసకు ముఖ్యశిష్యుఁడై వేదాంతాదిరహస్యములనెల్ల గ్రహించెను. రామకృష్ణపరమహంస మరణింపగా నరేంద్రుఁడపరిమిత విచారమునంది, యీ మహనీయుని యుపదేశమును జగంబంతటను వ్యాపింపఁజేయ సంకల్పించుకొని సంసారంబు బరిత్యజించి సన్న్యాసియై, వివేకానందస్వామియను నామంబునఁ దనరెను.

వివేకానందుఁడు కొన్నిసంవత్సరములు భగవత్పరిశీలనయందుఁ గడపి, దేశసంచారముసేయుచుఁ జెన్నపురమున కేగెను. చెన్నపురపౌరు లీ మహాత్ముని యఖండవిజ్ఞానము నెఱింగి సంతోషించి బహువిధంబులఁ బూజించిరి. దక్షిణదేశభారతీయప్రముఖు లీతనిని అమెరికాఖండమున చికాగో నగరమునకు సర్వమతసంబంధమగు మహాసభకుఁ బ్రతినిధిగాఁ బంపిరి. విదేశసంచారమునం దాతనియొద్దనున్న ధనమంతయు వ్యయమైనకారణమున నాతఁడు కొన్నిచిక్కులు పడవలసి వచ్చెను. కాని, చికాగోయందొక వృద్ధపుణ్యస్త్రీ యాతనిం దన గృహమునకు రమ్మని పిలిచెను. వివేకానందుఁ డామె యాహ్వానమును సంతోషపూర్వకముగా నంగీకరించి, యామె గృహంబున కేగి, తన చరిత్రమంతయుఁ నెఱుంగఁజేసెను. ఆమెసహాయమున నీతనికి మహామత సభాధ్యక్షుఁడైన “డాక్టరు బరోసు”తోఁ బరిచయము కలిగెను.

వివేకానందస్వామి యచ్చట జరిగిన సభలలో నిచ్చిన యుపన్యాసములువిని సభాధ్యక్షుఁడు మొదలగు వారెల్లరును యద్భుతమంది యాతనిననేకవిధంబుల గౌరవించిరి. తమతమ నగరంబులకువచ్చి, వేదాంతోపన్యాసము లిమ్మని యామహాత్ముని బలువు రాహ్వానించిరి. అనేకమంది యాతనికి శిష్యులైరి. అనేక ప్రదేశములం దార్యమత సంఘములు వెలసెను. భారత మాతృగర్భమున జనించిన యావిజ్ఞాన సంపన్నుఁడు పరదేశస్థుల కృతజ్ఞతకుఁ బాత్రుఁడగుచు నొక్కసంవత్సర కాల మాయా ఖండములయందు సంచార మొనరించి, మాతృభూమికి మరలివచ్చుచు సింహళంబునఁ గొన్నాళ్ళుండి, యచ్చటి వారి కానందముగూర్చి, యటనుండి చెన్నపురికి వచ్చెను. తరువాత నీతఁడు జన్మభూమిం జేరి, విస్మృతింబడిన వైదిక పథంబు నుద్ధరించుటకుఁ దన యావచ్ఛక్తిని ధారవోయుచుండ దేహారోగ్యము చెడి, శాశ్వతానందపదవిం జేరెను. బ్రదికినది కొలదికాలమైనను భరతవర్షము నుద్ధరించి తననామము చిరస్థాయిగఁ జేసికొనిన యీమహాత్ముఁడు భారతీయులకేగాక, యన్యదేశీయులకుఁగూడ నిరంతర స్మరణీయుఁడు గదా!

సత్యముకంటె నెక్కుడైన మతము లేదు.

---

## 8. శకుంతల-దుష్యంతుఁడు II.

దుష్యంతుఁ డరిగినపిదప, శకుంతల తాను చేసిన కార్యము కణ్వుఁ డెఱింగి యేమని కోపించునోయని విచారించుచుండెను. ఇంతలో ఫలములకరిగిన కణ్వుఁ డాశ్రమమునకు వచ్చి భయమందుచు నెదుట నిలిచియున్న శకుంతలనీక్షించి సమస్తము తనదివ్యదృష్టి నెఱింగి, యామెం గాంచి "కుమారీ! నీ వొక్కింతయు భయముందవలదు. సమస్తము నాకు గోచరమైనది. నీకుఁ దగినవరుని గాంచితివి. నీ విప్పుడు గర్భిణివైతివి. నీ గర్భమునన్న కుమారుఁడు చక్రవర్తియై యధికకీర్తివంతుఁడగును. నీ సచ్చరిత్రమున కేను మెచ్చితి. నీకు గావలసిన వరంబిచ్చెద కోరు"మని పలికెను. శకుంతల కణ్వునకిట్లు పలికెను. "తండ్రీ! నాచిత మెప్పుడును ధర్మమునందే యుండునట్లుగను, నాకుదయించు కుమారుఁడు వంశకర్తయు, దీర్ఘాయురారోగ్యబల పరాక్రమములు గలిగియుండునట్లుగను వరంబు లనుగ్రహింపుము."

కణ్వుఁడు శకుంతలకోరిన వరంబులనిచ్చి, యామెను మిగులజాగరూకతతోఁ జూచుచుండుటకు మునికన్యల నియమించెను. శకుంతలకుఁ బదియవమాసమున నొక శుభదినమున నొకకుమారుఁడు జనించెను. ఆకుమారునకుఁ గణ్వుఁడు జాతకర్మాదిక్రియల నెఱవేర్చి భరతుఁడను నామమిడెను.

భరతుఁడు దినదినప్రవర్థమానుఁడగుచు, గణ్వాశ్రమప్రాంత మునసున్న మృగములఁ బట్టి తెచ్చి యాశ్రమమునఁ గట్టుచు నచ్చటివారికెల్లరకును నద్భుతము గలుగఁజేయుచుండెను. మునీంద్రులాతనికి సర్వదమనుఁడను పేరుబెట్టిరి.

ఇట్లు కొంతకాలమరుగ కణ్వుఁడు శకుంతలఁజూచి "ఎట్టి పతివ్రతలకైనను బుట్టినింటఁ బెద్దకాలముండుట తగదు. కావున నీవింకఁ బతికడ కరుగుట ధర్మము" అని చెప్పెను. అందులకామెయు సమ్మతించెను. అంతటఁ గణ్వుఁడు మునికుమారులఁ గొందఱిని దోడిచ్చి పుత్రసహితముగా శకుంతలను దుష్యంతునిపాలికిఁ బంపెను. హస్తినాపురంబున నిండు పేరోలగంబునఁ గొలువుదీర్చియున్న దుష్యంతుని యెదుటకుఁ బోయి శకుంతల నిలిచియుండెను. ఆత డీమెంజూచి యేమియుఁ బలుకలేదు. శకుంతల తనమనంబున "ఈ రాజేంద్రుడు నన్నుఁ జూచియుఁ బలుకకయున్నాఁడు. చూపులుగూడ నదియొక విధమున నున్నవి. ఆనాడు కణ్వాశ్రమమున నీతఁడన్నమాటలు మఱచిపోయెఁగాబోలు! అట్లు తలంపరాదు. మఱచినవానికి జ్ఞప్తికిఁ దేవచ్చునుగాని యెఱిఁగియుండియు మాటలాడనివాని కెఱింగించుట కష్టము. అయినను నీతని కెఱింగించెదగాక" యని తలంచి, దుష్యంతునకిట్లనెను. "మహారాజా! వేటనెపంబునఁ గణ్వాశ్రమమునకువచ్చి, నా కొసంగిన వరంబుల దలఁపుము. సూర్యసమతేజుఁడైన యీకుమారుఁడు

నీ కుమారుఁడు. పౌరవకుల రత్నాలంకారుఁడగు వీనిని యువ రాజుగాఁ జేయుము."

ఆ పలుకులకు దుష్యంతుఁడు "అబలా! నీ వెవ్వరవో నే నెఱుఁగను. ఇట్టి యనుచితవాక్యములాడ నీకుఁదగదు. ఎక్కడనుండి వచ్చితివో యక్కడి కేగు" మని పలికెను. ఆమాట లకు శకుంతల నిశ్చేష్టితయయ్యెను. కన్నులవెంట జలములు బయలుదేరెను. కొంతసేపటికామె సంతాపము నడంచుకొని రాజునకిట్లు పలికెను. "ప్రాణేశ్వరా! సమస్తము నెఱిఁగి యుండియు నెఱుంగనని పలికినమాత్రమునఁ దప్పిపోవునా! వేదములు, పంచభూతములు, ధర్మువు, రాత్రింబవళ్ళు, సూర్యచంద్రులు, యముండును జూచుచుండగా దాను చేసిన కార్యము నరుఁడు దాచినను దాగునా? నీవు కణ్వాశ్ర మమున నాకిచ్చిన వరముల జ్ఞప్తికిఁదెచ్చుకొని న న్ననుగ్ర హింపుము. సకలధర్మార్థ కామసాధనంబులకును భార్యయే యుపకరణము. అట్టిభార్య నవమానించుట ధర్మముకాదు. నీ విపరీతవాక్యము లిఁకఁజాలించి యీపుత్రునిఁ జేకొనుము. ఆనాటివాక్యము లబద్ధము జేయకుము.

"చ॥ నుతజలపూరితంబులగు ♦ నూతులునూఱిటికంటె సూనృత
వ్రతయొకబావిమేలు, మఱి ♦ బావులు నూఱిటికంటె

త్క్రతువదిమేలు, తత్క్రతుశ • తంబునకంటె సుతుండు మేలు, త
త్సుతశతకంబుకంటె నొక • సూనృతవాక్యము మేలు సూడగన్.

మహాతపశ్శాలియైన విశ్వామిత్రునకుఁ దనయనైన నే నసత్యము పలుకుదునా?"

ఇట్లు శకుంతల పలికినవిని దుష్యంతుఁడు "నే నెవ్వఁడను? నీ వెవ్వతెవు? ఈ కుమారుఁడెవ్వఁడు? నాకేసంగతియుఁ దెలియదు. ఈ సభ్యులందఱు వినుచుండ నిట్టియసత్యములు పలుకుట నీకుఁ దగదు పొమ్ము" అనెను. అప్పుడు శకుంతల మిగులదుఃఖించుచు "నిఁక దైవమే శరణముగుఁగాక" యని తలంచి పోవనున్న సమయమున నాకాశమునుండి దివ్యవాణి "నృపాలా! ఈ కుమారుఁడు నీకును శకుంతలకును జనించినాడు. ఈమె మహాసాధ్వి. శంకింపక చేపట్టు"మను పలుకులు వినవచ్చెను. అంతట దుష్యంతుఁడు సభాసదుల కందఱి నిశ్చయము వినిపించి శకుంతలను గ్రహించి, భరతునకు యువరాజ్యాభిషేకము జేసెను.

సత్యముఁ దప్పరాదు.

---

# 9. సతీ సక్కూబాయి. (I)

కృష్ణానదీతీరమున "కరవీరపుర"మను పేరనొప్పు నగరం బొకటి గలదు. అందు సకలశాస్త్రంబుల నభ్యసించినవాఁడును, పౌరాణికుఁడునగు బ్రాహ్మణుఁ డొక్కఁడుండెను. ప్రపంచ మునన్ను దుర్గుణములన్నియు నాతనియొద్ద రూపములై కొని యున్నవని చెప్పవచ్చును. భగవద్భక్తిశూన్యుఁడును, పరధన వాంఛాపరుఁడును, నసూయాపరుఁడును నగు నా బ్రాహ్మ ణుని భార్యయు దుర్గుణములయం దాతనికిఁ దీసిపోవునదికాదు. అసత్యము, కుటిలత్వము, నిష్కరుణ మొదలగు గుణము లామె కాభరణములై యుండెను. ఇట్టి దంపతుల కొక్క కుమారుఁ డుండెను. ఈ కుమారున కాదంపతులు సౌందర్యవతియు, సకల సద్గుణవతియు నగు సక్కూబాయి యను నొక కన్న యను బెండ్లి జేసిరి.

సక్కూబాయికి బాల్యమునుండియు శ్రీకృష్ణ భగవా నునిపై నపరిమితమైన భక్తియుండెను. సాధుసేవ, భగవద్భక్తి మొదలగు సుగుణము లామెకు భూషణములై రాజిల్లుచుం డెను. ఆ కారణమున నామె యత్తవారిల్లు బ్రవేశించినను సాధుజనసేవ, భగవద్భక్తి గలిగియుండి, తోడివారలు "ఇట్టి సద్గుణవతి యెచ్చటను లే" దని చెప్పుకొనునట్లు వర్తించు చుండెను. ఇట్టికోడలినిజూచి యత్తమామలు సంతోషించు టకుమారుగా "ఇట్టి భక్తివలన గృహకృత్యములు చెడుననియు,

మనబోటివారి కిది తగ"దనియుఁ బలుకుచు నిరంతరమామెను దూషించుచు ననేకవిధముల హింసించుచుండిరి. పుణ్యగుణ శీలయగు సక్కూబాయి యత్తమామలుపెట్టు బాధలకోర్చు కొని, గృహకృత్యముల నావంతయుఁ గొఱఁతలేకుండఁ జేయు చుఁ గృష్ణుని సేవించుచుండెను. ఇరుగుపొరుగువారు సక్కూ బాయిపడుచున్న బాధలు జూడలేక యత్తమామలయొద్దకు వచ్చి, సక్కూబాయిని బాధపెట్టుట ధర్మముగాదని చెప్పు చుందురు. కాని కఠినచిత్తులగు వారికామాటలు రుచింపలేదు. సక్కూబాయికి అత్తమామలు పెట్టుచున్న బాధలు నానాటికి హెచ్చిపోవుచుండెను. తన్నురక్షింపుమని యామె భగవంతుని ధ్యానించుచుండెను. ఒకనాడు సక్కూబాయి గృహమునకుఁ బ్రక్కనున్న కాంతలు కొందఱామెయొద్దకు వచ్చి "అమ్మా! సక్కూబాయీ! నీకుజననీజనకులుగాని సోదరసోదరీమణులుగాని లేరా! నీ వత్తవారింటికి వచ్చినతరువాత మరల నెప్పుడును పుట్టి నింటికిఁబోవలేదే! నీవు పడుచున్న బాధలను మేము చూడఁజాలక యున్నా" మనిరి. అందులకు సక్కూబాయి వారికి "పుణ్యవతు లారా ! ఎవ్వరున్న నేమిప్రయోజనము కలదు? పూర్వజన్మ మున నేనుచేసిన పాప మీజన్మమున ననుభవింపవలయును. అయినను నా కా శ్రీకృష్ణభగవానుఁడే తండ్రి. రుక్మిణీదేవియే తల్లి. వారి యనుగ్రహ మెప్పుడు వచ్చునో యప్పుడు నా కడ గండ్లు తీరు" నని పలికెను.

ఇట్లుండ నొకనాఁడు సక్కూబాయి తనయింటి ప్రక్క నున్న శాంతయను బ్రాహ్మణస్త్రీతోఁ గృష్ణానదికి స్నానము సేయుటకుఁ బోయెను. నదీతీరముననున్న మఠములోఁ బెక్కండ్రు సాధువులు శ్రీహరిభజన సేయుచుండిరి. సక్కూబాయి యచ్చటికిఁబోయి యా సాధువులంజూచి "మీ రెచ్చటి కేగుదు" రని యడిగెను. పండరీపురమునకుఁ బోవు దుమని వారు బదులుచెప్పిరి. అంతట సక్కూబాయి తనతో వచ్చిన శాంతనుజూచి "నీ వింటి కేగుము. నే నీ సాధువులతో బండరీపురమునకుఁ బోయి పాండురంగని సేవింతు" నని పలికి, యా కాంతను బంపివేసి, తా నా సాధువులతో హరి నామసంకీర్తనముఁ జేయుచుండెను. గృహమున కేగిన శాంత సక్కూబాయింగూర్చి యా మెయత్తమామల కెఱింగించెను. కోపస్వభావముగల సక్కూబాయిభర్త యాక్షణముననే సాధువులున్న మఠమును జేరి, యచ్చట హరినామసంకీర్తనము జేయుచున్న సక్కూబాయిని దిట్టుచుఁ, గొట్టుచు లాగిగొని గృహమునకుఁ దీసికొనిపోయెను. అత్తమామలుగూడ సక్కూబాయిని గొట్టినదేగాక, యొక స్తంభమునకుఁ గట్టి వేసిరి. ఆసమయమున సక్కూబాయి శ్రీకృష్ణు నుద్దేశించి "కృష్ణా! పండరీపురమున కరుదెంచి నీయుత్సవమును జూడఁదలఁచిన నే నిట్లు బంధింపఁబడితిని. న న్నెట్లు రక్షించెదవో! నీదేభార" మని వేడికొనెను.

బంధింపఁబడిన సక్కూబాయి కన్నపానీయాదు లీయక యత్తమామలు బాధించుచుండిరి. ఇట్లు రెండు మూడు రోజులు గడచెను. భగవంతుండగు శ్రీకృష్ణుఁ డామె యెడలఁ గరుణవహించి యొకనాటి యర్ధరాత్రిసమయమున సక్కూబాయిరూపము ధరించి యామెయొద్దకు వచ్చి నిలిచెను. సక్కూబాయి స్త్రీవేషముననున్న భగవంతునిఁ జూచి "నీ వెవ్వతె"వని యడిగెను. "అమ్మా! నేను పండరీపురమునకుఁ బోవుచున్నాను. భక్తురాల వగుటచే నీవు సహాయముగ నుందువని తలంచి, నిన్నుఁ దోడ్కొనిపోవుటకు వచ్చినా" నని భగవంతుఁడు బదులు చెప్పెను. అందులకు సక్కూబాయి "తల్లీ! నీకు నాపైనున్న కరుణ కొంతయు సంతసించితిని. నావలన నీకుఁగూడ నా యత్తమామలవలనను, మగని వలనను మాటవచ్చును. నాకై నీ వేల శ్రమపడెదవు? నీ వేగుము. శ్రీపాండురంగనికి నాకు మారుగ నీవు నమస్కారము లర్పింపుము." అని పచించెను. కరుణామయుండగు భగవంతుడు "నీవు పండరీపురమునకుఁబోయి దేవదేవుని మహోత్సవ వైభవమును దిలకించి యానందించుచుండుము. ఇచ్చట నీకు బదులుగా నే నుండెద"నని చెప్పి యా సక్కూబాయికిఁ గట్టఁబడియున్న త్రాళ్ళనువిప్పి, తాను కట్టించుకొని సక్కూబాయివలెనే యచ్చట నుండెను.

---

## 10. సతీసక్కూబాయి. (II)

భగవంతునిచే బంధమోక్షముచేయఁబడిన సక్కూబాయి మఠమునకు వచ్చి సాధువులఁ గలిసికొని, వారితో బయలుదేరి పండరీపురమున కేగెను. అచ్చట నామె చంద్రభాగానదియందు స్నానమాచరించి, శ్రీ పాండురంగదేవుని దర్శించి, మహోత్సవంబులఁ గాంచుచు, భాగవత శేఖరులతో నిరంతరము హరినామసంకీర్తనము జేయుచుండెను. భక్తులెల్లరును నామె యనుపమాన భగవద్భక్తిని ననేకవిధముల శ్లాఘించుచుండిరి.

ఇఁకఁ గరవీరపురమున సక్కూబాయి వేషధరుఁడగు కృష్ణుఁడెట్లున్నాఁడో చూతము. భగవంతునిమాయ యెవ్వరికిని దెలియదుగదా! అత్తమామ లాహారాదులీయక సక్కూబాయివేషధారిని బాధించుచుండిరి. అప్పుడు సక్కూబాయి మగఁడు కొంచెము కరుణగలవాఁడై "ఇట్లాహారమీయకుండ బంధించియుంచినచో నీమె మరణించును. అదియునుగాక యీమె సద్గుణవతియగుటకు సందియము లేదు." అని తలంచి, యామెను బంధవిముక్తురాలిగఁ జేసెను. నాటినుండియు సక్కూబాయివేషధరుండగు పరమాత్ముఁడు సక్కూబాయినిమిత్తము వారి గృహంబున సంసారకృత్యములు సేయుచుండెను.

ఇట్లుండఁ బండరీపురమున నొకనాఁడు సక్కూబాయి పాండురంగని సన్నిధియందు హరినామసంకీర్తనము సేయుచు నచ్చటనే ప్రాణములు విడిచెను. సక్కూబాయి పాండురంగనియం దైక్యమయ్యెనని యచ్చటి సాధువులందఱు నద్భుతమంది యామెశరీరమును చంద్రభాగాతీరమున విధ్యుక్తముగా దహనం బొనర్చిరి. పాండురంగమహోత్సవముల జూడవచ్చిన కరవీరపురవాసుఁడైన యొక బ్రాహ్మణుఁ డీ వృత్తాంతమును సక్కూబాయి యత్తమామలకును మగనికిని నెఱింగింపదలఁచి బయలుదేరెను.

భగవంతునిచర్య లనంతములు. తనభర్త సక్కూబాయి వేషముతో నామెయత్తవారింటఁ గరవీరపురంబున నున్నాఁడని తలంచి రుక్మిణీదేవి సక్కూబాయిని తనమహిమచే బ్రతికించి "పుత్రికామణీ! భక్తురాలవగు నీ నిమిత్తము నా నాథుఁడు నీవేషమున మీయింటిలో నున్నాఁడు. ఇఁకనీవరిగి యాతని నిటకుఁబంపుము. నీ వా దేవుని యనుగ్రహమున సర్వశుభముల నందఁగల"వని చెప్పెను.

సక్కూబాయి పండరీపురమునుండి బయలుదేరి కరవీరపురమునకు వచ్చెను. ఆమె యచ్చటఁ గృష్ణానదీతీరమునకు వచ్చునప్పటికి సక్కూబాయివేషధరుఁడగు శ్రీకృష్ణుఁడు బిందెఁ గొని జలములఁదెచ్చుటకు వచ్చెను. అతఁడు సక్కూబాయిని

జూచి "పండరీపురమున దేవతామహోత్సవమంతయుఁ జూచి వచ్చితివా" యని యడిగెను. సక్కుబాయి యామహాత్ముని పాదకమలములకు నమస్కరించి "తండ్రీ! భక్తురాలియందు దయచే నీ వెన్నికష్టములు బడినావ" వని పలికి యనేకవిధముల స్తుతించెను. అంతటఁ గృష్ణుఁడు తనచేతనున్న బిందె నా సక్కుబాయికొసంగి "ఇఁక నీవు గృహంబున కరుగుము. మదీయ కరుణచే నీకు సకలశుభములును గలుగును. నీయత్త మామలును, భర్తయుఁగూడ జ్ఞానవంతులగుదు"రని చెప్పి యదృశ్యుఁడయ్యెను. సక్కుబాయి నిజగృహమున కేగెను. ఆ సమయంబునం దచ్చటికి పండరీ పురమునుండి సక్కుబాయి మరణము నామెయత్తమామల కెఱింగింపవచ్చిన బ్రాహ్మణుఁడు సక్కుబాయినిగాంచి యాశ్చర్యమందెను. అచ్చట జరిగిన సంగతియంతయు సక్కుబాయి యత్తమామల కెఱింగించెను. వారును నద్భుతమంది సక్కుబాయి వలన సర్వము నెఱింగి యామెయెడలఁదామొనర్చిన యప రాధముల మన్నింపుమని వేడుకొనిరి. సక్కుబాయి "మీరు నన్నట్లు వేడవలదు. మీయనుగ్రహముచేతనే నేను పండరీ నాథుని దయఁ గాంచఁగలిగితి" నని పలికెను.

భక్తులను దైవము సంరక్షించును.

---

# ఆర్యకథాలహరి.

2, 3, 4, 5, 6, 7, 8 తరగతులకు.

ఇందలి కథలు బాలురకు సుఖబోధకముగురీతిని తేట మాటలతో నాయా తరగతుల కనుగుణ్యముగ వ్రాయఁబడి యున్నవి. ఇందు వాడఁబడిన కథలు విద్యార్థుల హృదయంబుల దేశాభిమాన దైవప్రభు భక్త్యంకురముల జక్కఁగ నాటిలఁ జేయు సమర్థములై యొప్పుచున్నవి. ఇయ్యవి విద్యా విధానమునం దెక్కుడనుభవమును, వైదుష్యమును గలిగినవారిచే విరచింపఁ బడినవి. ఈ కథలు శైలియందును, వస్తుస్వీకరణమునందును రమ్యములై కన్పట్టుచున్నవి. ప్రాథమిక పాఠశాలల విద్యార్థులు మొదలు, అయిదవ ఫారము బాలురవరకు మిక్కిలి యుపయోగకరములై యొప్పుచున్నవి.

| | | |
|---|---|---|
| ఆర్యకథాలహరి | మొదటి భాగము | 0—2—0 |
| ,, | రెండవ భాగము | 0—2—6 |
| ,, | మూడవ భాగము | 0—3—0 |
| ,, | నాల్గవ భాగము | 0—4—0 |
| ,, | అయిదవ భాగము | 0—5—0 |
| ,, | ఆరవ భాగము | 0—6—0 |
| ,, | ఏడవ భాగము | 0—8—0 |

వలయువారు :— రామా అండ్ కో.,

తర్లపాడు, (నెల్లూరుజిల్లా).

# సోదరులకొక మనవి.

అయ్యా! మావద్ద అన్ని కంపెనీల, అన్ని రకముల యింగ్లీషు, తెలుగు పుస్తకములు, నాటకములు, నవలలు, శాస్త్రగ్రంథములు, వైద్యగ్రంథములు, ప్రబంధములు, నీతి శాసనములు, అన్నిరకముల స్కూలు పటములున్నూ, బజారు పుస్తకములున్నూ, స్టేషనరీ సామానులున్నూ దొరకగలవు. స్కూలురిజష్టర్లు, ఎక్కాలబుక్కులు, గణితబోధినీలు, క్రొత్త సంవత్సరపు పంచాంగము కేలండర్లు వర్తకులకు చాలతక్కువ ధరకు విక్రయించెదము.

ఇవియిగాక మావద్ద స్వదేశి రాతిపలకలు గలవు. నిపుణులైన పనివాండ్రచే తయారుచేయబడి చూచుటకు రమ్యములై కన్పట్టును. ధరలు అతిసరసము. ఒకమారార్డరిచ్చిన మాసంగతి మీకే తెలియగలదు. వలయువారు చిరునామాలు స్పష్టముగా వ్రాయవలయును. రు 5—0—0 మించిన ఆర్డర్లను అడ్వాన్సుతో పంప ప్రార్థితులు.